ఇందు సుందర కాండ కథ
సులభశైలిని వ్రాయబడినది.

# శ్రీ ఆంజనేయ శతకము

ప[illegible]ర

తాతా
సూర్య ప్రకాశ రావు

ఆంధ్రగ్రంథాలయము,
విజయనగరము.

# అత్యద్భుతజ్యోతిషము

హిందూదేశము, బర్మా, సింహళద్వీపము, ఆఫ్రికాఖండము, మొదలగుదేశములలోను ప్రపంచ మెల్లెడలను అనేకయోగ్యతాపత్రికలున్ను మిక్కిలిఖ్యాతిని కలిగినటువంటి

## ప్రొఫెసరు ప్రకాశరావుగారి

## అత్యద్భుతజ్యోతిషము

మీపుట్టినసంవత్సరమును, నెలయును, తిథియును, వేళయును తెలుపుము; లేదా మీజనననక్షత్రమును వయస్సును తెలుపుము; లేదా మీరు తెరమువారియు వేళ్లైనను తెలియజేయుడు ఒకరూప్యమునకు (రు 1-0-0) మీముందుసంవత్సరఫలములన్నియు నసద్గ్రంథమును అత్యాశ్చర్యముగను చెప్పగలము.

ఈదిగువ వివరించిన యున్నతపత్రికలును, సర్టిఫికేట్లను దయతో గమనింపుడు;—

పి. హనుమంతరావు, బి.ఏ., బి యల్, అనంతపురమునుండి యిట్లు వ్రాయుచున్నారు:— మీరు పంపించిన సంవత్సరఫలితము అత్యద్భుతముగ బుజువిచ్చినందుకు నేను మిక్కిలి సంతసించితిని.

బరోడా మహారాజాగారి ఎ. డి. సి. గారగు హాస్కల్ హేవన్ గారిట్లు వ్రాయుచున్నారు;— మీరు నాకంపిన సంవత్సరఫలముతోను స్వభావసూచనతోను తృప్తినొందితిని.

బంగాళాదేశములోనున్న వహాడపురా కాపురస్థులగు బీహారీలాల్ ఘోషు, ఎమ్. ఏ, బి. యల్., గారిట్లు వ్రాయుచున్నారు:— మీరు పంపించిన మూడు సంవత్సర ఫలితములను చూచి నేను మిక్కిలి ఆశ్చర్యపడితిని.

మొరదాబాదు డిప్యూటీ కలెక్టరుగారగు ఖుజాన్ ఫర్ మహమ్మదుఖాన్ గారిట్లు వ్రాసిరి:— మీరంపిన సంవత్సరఫలములు మిక్కిలిచక్కగా బుజువిచ్చినవి.

ముజాఫర్ పురమున సబుడిప్యూటీకలెక్టరుగానున్న రాధాకాంతశరన్ గారిట్లువ్రాసిరి:— క్రిందటి సంవత్సరమున నా సంవత్సరఫలములు మీకడనుండి తెప్పించుకొంటిని అవిమిక్కిలి తృప్తికరముగాను నిజముగాను యున్నవి.

కుంభకోణమునుండి ఆర్. నరసింగరావు, బి. ఏ., బి యల్, గారిట్లు వ్రాసిరి:— మీ జ్యోతిషమును, మీరుచెప్పు భవిష్యత్ఫలములును, ప్రొఫెసరు రాక్సురాయి, ప్రొఫెసరు జాజ్రి మొదలగు ఐరోపాఖండపు గొప్పజ్యోతిష్కుల ఫలసూచనలకు చాలమీరుచున్నవి.

ఢిల్లీలోనున్న ఇండియాగవర్నమెంటువారి క్యాంపులోనున్న ఎమ్. షోడశోపచారసానిగారిట్లు వ్రాసిరి:— మీ సంవత్సరఫలసూచనలు నాకు మిక్కిలి సంతోషమును కలిగించినవి.

శ్రీ తిరుచునాపల్లి జిల్లా కరూరు పోలీసుడిప్యూటీ సూపరింటెండెంటుగారగు ఆర్. ఎస్. కృష్ణస్వామిగారిట్లు వ్రాసిరి:— మీ ఫలసూచనతో నేనెంతయు సంతసించితిని.

గుంటూరునుండి జిల్లాకోర్టువకీలుగానున్న టి. నాగభూషణం బి. ఏ., బి. యల్., గారిట్లు వ్రాసిరి:— మీరు మాకంపిన సంవత్సరఫలసూచనలు మాయనుభవమునుబట్టి పూర్తిగా సరియైనవయ్యెను.

నీలగిరిలోనుండు కూనూరులోనున్న ఆనందాశ్రమము శివమందిరమునుండి శివధ్యానానందస్వాములవారిట్లు వ్రాసిరి,— మీరంపిన సంవత్సరఫలములు అక్షరముల దాఖలాగానున్నవి. అందుకుగాను నా వందనములు గైకొనుడు. వానికై నావెచ్చించిన రూప్యము వెండినాణ్యము నాకు దానియొక్క బంగారము నొసగినది. ప్రతిగూడ నుండుదు బ్రతికియున్నంతకాలము మీచే వ్రాయబడు సంవత్సరఫలముల దెప్పించుకొనవలెనని కోరుచున్నాను.

ఆఫ్రికాఖండములో యూజిప్టుదేశములోనుండు సూడాను రేవుపట్టణమునుండి సయ్యదు అహమ్మదు హుస్సేనుగారిట్లు వ్రాయుచున్నారు;— మీరంపిన జాతకము మిక్కిలి ఋజువుగానున్నందుకు నేనెంతయు సంతసించుచున్నాను. అందులో చెప్పిన ప్రతిహంశమును మిక్కిలి ప్రమాణముగనున్నది.

లక్నో డిస్ట్రిక్టు మునసబుగానున్న పత్యాగుమహాత్మ్యముగారిట్లు వ్రాయుచున్నారు:— నాకు మీరు పంపించిన సంవత్సరఫలితములు మిక్కిలి అద్భుతముగానున్నవి.

తంజావూరునుండి టి. కోదండరామయ్యంగారు బి.ఏ., బి.యల్., హైకోర్టు వకీలు గారిట్లు వ్రాసిరి:— మీరు నాకంపిన సంవత్సర ఫలసూచనలంతయు సరిగా జరుగుట చూచి నేను మిక్కిలి యాశ్చర్యమందితిని. ఒక్క మాటయైనను తప్పిపోవుటలేదు.

అక్బరుపూరులో డిస్ట్రిక్టు మునసబుగానున్న బనార్సీలాల్, బి.ఏ., యల్.యల్.బి., గారిట్లు వ్రాసిరి:— మీ ఫలసూచనలు మిక్కిలి ఆశ్చర్యముగాను సరిగానున్నవి.

భావనగరునుండి హరిహరరాయి కల్యాణరాయి గారిట్లు వ్రాసిరి:— మీరు నన్నుగురించి చెప్పిన భవిష్యత్ఫలములు యథావత్తుగ సరిగా జరిగినవి. మీరు నన్నుగురించి చెప్పిన స్వభావఫలసూచన యెన్నిసారులు చదివినను తనివితీరక తిరిగితిరిగి చదువవలెననే యున్నది. మీరు సాక్షాత్తు దైవజ్ఞులేయని నాకుతోచుచున్నది. మీయందున్న గొప్పశక్తికి మీకెంతబహుమానమైనను యీయవచ్చును.

సింహళద్వీపమునకు ముఖ్యపట్టణమగు కొలంబోనుండి డేవిడ్సన్ అండు కంపెనీలోనున్న ఏ. నాగలింగంగారిట్లువ్రాసిరి:— ఏయే వేళలందు నేనేలాగున జరుగుచుందునని నన్నుగురించి నా భవిష్యత్ఫలములను చెప్పితిరో అదేరీతిగా నేయవి జరిగినవి. అందుకుగాను మీ పేరుప్రతిష్ఠలను నా

స్నేహితులతో పొగడబడుచున్నందున మీ ఖ్యాతిని నేను మి
క్కిలి వెల్లడిపరచెదను.

కలకత్తానుండి శ్రీ శరచ్చంద్రసన్యాల్, యమ్. ఏ.
బి యల్., గారిట్లు వ్రాయుచున్నారు:— నాకు మీరు గత
సంవత్సరములో పంపించిన సంవత్సరఫలము పూర్ణముగా
తృప్తి కలిగించినది. వాస్తవభావమూలకఫలము చాలా అద్భు
తముగా నున్నది.

బీహారు దేశములోనున్న షికోహాబాదు రాజ్యమునకు
రాజగు ఆనరబుల్ రాజకుమార రిపుదమనసింగుగారిట్లు వ్రా
సిరి:— మీరు పంపించిన సంవత్సరఫలితములు అతిదా
ఖలాగానున్నందున నేను మిక్కిలి ఆనందమును పొం
దుచున్నాను మీ తెలివితేటలను మీ పాండిత్యములను నేను
మిక్కిలి కొనియాడుచున్నాను. భావిఫలములను చెప్పుట
లో మీకుగల అత్యద్భుతమయిన శక్తి నేను మిక్కిలి ఆశ్చ
ర్యమును పొందుచున్నాను. జ్యోతిశ్శాస్త్రములో మీకింత
గొప్పశక్తి కలుగుటకు కారణము మీయందున ఈశ్వరునకుగల
కృపయే.

ఇంకను అనేకయోగ్యతాపత్రికలు కలవు. గ్రంథ
విస్తరభీతిచే నిచ్చట వ్రాయలేదు.

ఒకరూపాయ్యమునకు (1-0-0) ఒకసంవత్సర ఫలి
తము ఆంగ్లేయభాషలో (ఇంగ్లీషు) టైపువేసి పం
పబడును. తెనుగుభాషలో పంపబడదు.

సంవత్సరఫలితములు కోరువారు ఈ క్రింది చిరునామాకు వ్రాయవలెను.

ప్రొఫెసరు, ప్రకాశరావుగారు,
ప్రొప్రయిటరు, కళింగ ఎస్ట్రొలాజికల్ బీరో,
వి జ య న గ ర ము,
(విశాఖపట్నం జిల్లా.)

---

సర్వజనోపయుక్తమగు

# పు స్త క మా ణి క్య ము

---

'హెవెన్సు అస్ట్రాయిల్లు' అను అత్యద్భుత జ్యోతిషగ్రంథము. ఈ పుస్తకముయొక్క సహాయముచే జాతకము, పుట్టిన తేది, నక్షత్రము మొదలగునవేమియు అవసరములేకుండ యెవరిమట్టుకువారు ఇతరుల సహాయము యేమియు అక్కరలేకుండ అతిసులభముగా పదిసంవత్సరములవరకు తమకు రాబోవు భావిఫలములను తెలుసుకొనగలరు. జాతకముయొక్క అవసరములేకయే తమతమ ఆయుర్దాయమునుగూడ తెలుసుకొనగలరు. తమ

యొక్క ఆయువును వృద్ధిచేసుకొనుటకు చేయవ
లసినపనులు యిందు చక్కగా వివరింపబడినవి.
ఇదివరకు యెవరును ఇట్టిసంగతులను విని కని తె
లిసికొనియుండరు. ఇట్టి అపూర్వమైన జ్యోతిష
గ్రంథరాజమును గురించి 23.7-1921 తేదీగల
ఆంధ్రపత్రికయిట్లువ్రాయుచున్నది. 'హేవెన్ను
అన్నాలుల్లు'. ఇయ్యది సర్వజనోపయుక్తమగు
పుస్తకమాణిక్యము. ఇందలి ప్రతివిషయమును
అమూల్యము. జ్యోతిష్కులమని ప్రజలవంచిం
చు మాయావులకు పదులు పాతికలు సమర్పించి
వారుచెప్పెడు కల్లమాటలునమ్మి మోసపోవువా
రికిది కల్పతరువు. ఇతరుల సహాయమేమియును
అక్కరలేకుండ జాతకము జన్మనక్షత్రము మున్న
గువానితో పనిలేకుండ ఏనెలకానెలలో కలుగ
గల భావిఫలములను ఎవరిమట్టుకువారు కనుసుల
భముగ చూచుకొనవచ్చును. అట్లు ప్రతివిష
యమును ప్రతివారికిని బాగుగబోధపడునట్టి ఈ
గ్రంథరాజము అతిసులభమైన తెనుగులో వ్రా
యబడినది మరణకాలమును నిర్ణయించుట,
సూర్యచంద్రనాడులనుబట్టి శుభకార్యప్రారంభ

మనుజునకు అనుకూలకాలనిర్ణయము, దీర్ఘజీవి
తమునకు చేయవలసినపనులు నిందువివరింపబడె
ను. ఒకరిసహాయ మవసరములేకుండ తెలియవ
లసినవిషయములన్నియు దీనియందు గలవనుట
యతిశయోక్తిగాదు. ఇంకను వేనవేలు అభిప్రా
యములుగలవు. గ్రంథవిస్తృతిచే యిక్కడ
వ్రాయలేను. వేయేల? ఒకపరి చూచిన మీ
కే నిజము తెలియును. దీనివెల పోష్టుఖర్చులుగాక
రూ. 2—0—0. పుస్తకములు వలయువారి
క్రిందిచిరునామాకు వ్రాసిన బడయగలరు.

ప్రిమియర్ ఎష్ట్రాక్ట్ బీరో,
విజయనగరము.
(విశాఖపట్నం జిల్లా.)





శ్రీరామాయనమః

# ఆంజనేయశతకము

---

గీ. శ్రీలలిత వజ్రకాయా ♦ శ్రితవిధేయ
జనకజామోదసంధాయ ♦ సమరగేయ
భవ్యకపిరాయ లక్ష్మణ ♦ ప్రాణదాయ
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ ♦ ఆంజనేయ.

గీ. భానుపుత్రుని గొల్చియా ♦ భానుకులుని
రాకగని స్వభక్తిమంబున ♦ రాముతోడ
సఖ్యమొనరింపఁ జేసితి ♦ సత్వరమున
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ! 3

గీ. ఇరదుప్రాసిన రచియున ♦ కొలమిభాను
ప్రాసియున్నట్టి ఛాయగా ♦ బరిఢవిల్లు
సీత గాంచితివా లోక ♦ మాతనార
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 13

గీ. ధూళిధ్వంగిన మునితో ♦ తొలగియున్న
ధూమగావళితోడను ♦ పొలుపుదక్క
యున్న సీతను గాంచితి ♦ వన్నదయను
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 14

గీ. చిన్నబోయిన మోముతో ♦ చెన్నుదరిగి
యున్న తనుకాంతితో వాడి ♦ యున్నపుష్ప
లతికవలెసీతగాంచితి ♦ వతులమతిని
అమరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 15

గీ. ఘనవృకావళిమధ్యను ♦ గనుపడంగు
హరిణపోతంబుకైవడి ♦ నార్తి జెందు
వంశభూపుత్రి గంటివా ♦ నందమొంద
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 16

గీ. రాక్షసాంగనలెల్లను ♦ నాక్షణంబ
మేలుకొంచిరి యా దిరగు ♦ వేళ కాద
టంచు శోకనుపొందితి ♦ వంచిమదని
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 17

గీ. అంతరాక్షసభామినులు ♦ చెంతఁజేరి
సీతఁగనుఁగొని బెదరింప ♦ చిత్తమందు
కోపమున బండ్లు గొరుకవే ♦ క్షోభమునన
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 18

గీ. రావణుఁడంత సీతపై ♦ రాగమునను
వనికి జనుదెంచి సీతతో ♦ వలపుమాట
లాడుటను విని మదినతి ♦ గోపమొందు
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 19

గీ. కారుమాటలు సీతను ♦ జేరపలుక
శాఖపై నుండి వినుచును ♦ ధ్వాంతమునను
భగ్గుభగ్గురమండవే ♦ భళిరయుప్పు
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ 20

గీ. రావణుండంతనంతఃపు ♦ రంబుఁ జేర
దనుజవనితలు నిద్రలో ♦ మునిగియుండ
రామకథ దెల్పితివి వేడ్క ♦ రాముసతికి
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 21

గీ. దండకావనిలోపల ♦ తండ్రియాజ్ఞ
తమ్ముతో సీతతోఁ గూడి ♦ దనరుచుండ
సీతఁగొనిపోయెనొకదని ♦ చెప్పితివిగ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 22

గీ. అంతనిజపుత్రుతోమైత్రి • సల్పింతమలర
జేసి వాలినిఁ గునిమి కి • ష్కింధకీశుఁజ
పట్టమునుగట్టినని నీట్లు • పల్కితివిగ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 23

గీ. సీతగనుగొనిరమ్మని • ప్రీతితనర
భానుపుత్రుఁడు కపులను • బనుపవేఁగ
నబ్ధిఁగడిదాటివచ్చితి • ననఘభళిర
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 24

గీ. నిజముగా రామభక్తుండ • సేతుతల్లి
నమ్ము మొదలోనటంచును • నమ్ముదమున
నంగుళీయకమిచ్చితి • వవనిజకును
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 25

గీ. అంగుళీయకముప్పడా • యవనిపుత్రి
శిరమునధరించి పతిరీతి • నెరవుచుండ
గాంచిముదమున జెందిన • ఘనుఁడవయ్య
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 26

గీ. తల్లినీపతి సద్గుణా • ధాముఁడనుచు
సకలశుభలక్షణంబుల • నాత్మకథను
నమ్మకముగాగ పల్కావె • నమ్మితోడ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 27

గీ. అంతరాక్షసవీరులు • కుంభఖడ్గ
తోమరాముఖులగైకొని • తొలుతనిన్ను
దలపడగ వారిగూల్పవె • చలముమీఱ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 33

గీ. చావగానిగులుదనుజులు • సత్వరమున
బరువులిడి లంకజొచ్చియు • పంక్తిముఖుని
తోడదెల్పిరి వేగని • జాడలపుడు
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 34

గీ. జంబుమాలిముఖాసురుల్ • క్షణములోన
బాణపంక్తులనినుగప్ప • బలిమిమీఱ
వారిదెగటార్చితివి మెల్ల • శూరులగర
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 35

గీ. బలములెల్లనుగూలిన • పంక్తిముఖుడు
నాక్షణంబున బనుపగా • నక్షుడేగ
యమపురికిబంపవే వాని • నతిబలమున
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 36

గీ. అంతనంతకుమాఁడ్క్రము • ఘాంతశౌర్య
ధైర్యుఁడగు మేఘనాధుండు • తక్షణంబె
నిన్ను పనిలోన దాకడె • నింగిముట్టె
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ 37

గీ. మేఘనాధునిశక్తికి ♦ మెచ్చుకొనుచు
పంక్తివదనుని గనుగొన ♦ వాంఛగల్గి
బాణమున పట్టువడితివి ♦ బలమునంది
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 38

గీ. పట్టుబడకోతి యంచని ♦ బట్టినిన్ను
కట్లుగట్టుచు రావణు ♦ కడకువేగ
దనుజులెల్లనుగొనిపోవ ♦ జనవెనివు
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 39

గీ. భూరినవరత్నచిత్రిత ♦ భూషితంబు
నైన రావణునాస్థాన ♦ మప్పుడుచేరి
దేవవైభవుగనవెయా ♦ దివిజవైరి
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 40

గీ. పద్మసంభవుకులమున ♦ పరగబుట్టి
శృతులస్మృతులనుపఠియించు ♦శుభగమతిని
పరులకాంతలదెచ్చుట ♦ పాపమనవె
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 41

గీ. రాముడనగనువిష్ణుండు ♦ రాక్షసేంద్ర
మదినిదెలియుక నీవతి ♦ మదముకతన
సీతదెచ్చితివని బుద్ధి ♦ చెప్పితివిగ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 42

గీ. సాధులనుబోరిన దుష్టుల ♦ సంహరింప
రాముడనగను నాదినా ♦ రాయణుండు
యనుచుబల్కవె రాక్షసు ♦ ల్వినగనీవు
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 43

గీ. అసురులనుబట్టివధియింప ♦ నవనియందు
రాముడై పుట్టెబువిని నా ♦ రాయణుండు
వెలసెననియంటివసురులు ♦ వినగనీవు
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 44

గీ. గొప్పతపమున బ్రహ్మను ♦ మెప్పుజేసి
యొప్పుచున్నట్టినీవంటి ♦ యోగ్యుననును
పరుల స్త్రీలను దెచ్చుట ♦ పాపమనవె
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 45

గీ. సీతయనవాదిలక్ష్మి నీ ♦ చిత్తమునను
దెలిసిమతికరివగుము నా ♦ పలుకవినుము
కులము కీర్తిని జగమున ♦ నిలుపుమనవె
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 46

గీ. దేవతావళిచేతను ♦ చావులేని
వరముగోరితివది నేడు ♦ ధరనిరర్థ
కంబటంచునుబల్కవె ♦ డంబువిగార
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 47

గీ. తత్క్షణంబున దనుజుల ♦ పీకలకును
వెక్కసంబొంద దనుజులు ♦ సుగ్రీవపుత్రమి
పరిఘమును చేతగైకొని ♦ పరుగులిడవె
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 53

గీ. కాలశిఖిపోల్కి వహ్నినీ ♦ వాలమునను
వెలయు దనుజుల శోధించి ♦ చలము మెరయ
వారలందర జేయువే ♦ నీరుగాగ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 54

గీ. చెలగి సౌధాళి భస్మంబు ♦ జేసి వహ్ని
దనుజులందఱ బడద్రోసి ♦ దనుజవిభుడు
జూచుచుండగ శూరత ♦ జూపితౌర
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 55

గీ. వీధువీధుల దిర్పుచు ♦ వీరరాక్ష
సావళుల్పట్టణంబున ♦ నతిరయమున
వారలందర దెగటార్చి ♦ వరలితివిర
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 56

గీ. వాలవహ్నిని పురిలోన ♦ వానివారి
గృహముల దహించి దనుజుల ♦ గిట్టిబట్టి
చంపవే నీదుసత్కీర్తి ♦ బెంపుమీర
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 57

గీ. కొందరార్తిని జెందిరి ♦ కొందఱగ్ని
శిఖలలో కాలిమ్రందిరి ♦ చెలువుదక్కి
నందు మితిలేనిబలము వే ♦ జెందితౌర
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 58

గీ. ధనములనుతీయువారలు ♦ తనయులిండ్ల
నుండిరనిబోయి యగ్నిలో ♦ మండువారి
జారిగనుగొనిచెలగవే ♦ భూరిమహిమ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 59

గీ. రత్నరాసులు కూలిన ♦ నూత్నసౌధ
గోపురంబులుకనుగొని ♦ కోపమొదవ
నసుర లనిదాకగూల్పవే ♦ యాత్మగాంబ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 60

గీ. ఇటులవాలాగ్నిశిఖలచే ♦ నటులగతిని
పురముదహియించి దనుజుల ♦ సరసిగూల్చి
యతిబలంబున మొలగితి ♦ వతులమహిమ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 61

గీ. రౌద్రుడైపురముగూల్చిన ♦ రుద్రుడనగ
పురముశిఖిపాలుగాజేసి ♦ భూమిపుత్రి
మనమునదలంచి శోకాబ్ధి ♦ మునిగితౌర
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 62

గీ. కోపమొక విషజనులకు ♦ పాపమొసవ్వ
పాపముసనరక బాధలు ♦ ప్రాప్తిగన దె
సీతదలచక పాపంబు ♦ జేసితిన వి
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 63

గీ. అంత దెలివొందిసద్భక్తి ♦ స్వాంతమునకు
సీతకృపచేత నిట్టుల ♦ జేయు నా మె
కగ్ని బాధలుగలవెయం ♦ చలరితివిర
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ 64

గీ. అనుచు ధైర్యంబునొంది నీ ♦ వాత్మయందు
వాలవహ్ని నినార్పగా ♦ వలయుననుచు
జలధి చేర వె నినుజూచి ♦ జలధిబనుప
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 65

గీ. వెనుకగా వాలమును ముంచి ♦ వనధిలోన
వాలవహ్ని నిజల్లార్చి ♦ శీలమునర
సీత జేరినమస్కృతుల్ ♦ జేసితివిగ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 66

గీ. భక్తిపరిణతి ల్లిసీతకు ♦ భావమలర
నమ్మ నీవిభుదో ర్జైత్రు ♦ నమ్మమిక ను
కలవునిమ్మనియనుగ వె ♦ చాలభక్తి
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 67

గీ. అర్భకునీతమ్మ విభునకో ♦ కొ(...)నవాలు
తనదుశిరమునను న్న ర ♦ త్నంబునివ్వ
గైకొనవవేళ్ళ నర్భ కి ♦ గడలుకొనగ
సమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 68

గీ. ఒడకమ్మరో కపిరాజు ♦ తోడ రాగ
కపిబలంబులుకోడను ♦ తెమ్మవిభుండు
గానఁబనిపంపునన వెక ♦ రంబుభక్తి
సమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 69

గీ. అంతదాకను నీవిట ♦ నాగకున్న
నాదువీపెక్కరమ్మ నీ ♦ నాధుకడకు
వేగగొనిపోదుననవె న ♦ న్వేళభక్తి
సమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 70

గీ. అనుచుబల్కన ననవిడ ♦ యాత్మనలరి
తనువునను నెట్లుగొనిపోదు ♦ వనగనీవు
జూపవేభూరిరూపంబు ♦ క్షోణిసుతకు
సమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 71

గీ. అమ్మ నారాకగోరుచు ♦ నబ్ధినల
ఘునవనౌకనులుండిరి ♦ క్షణముసందె
కోదునవనియాజ్ఞకోరవే ♦ భూమిసుతను
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 72

గీ. సెలవు గైకొని భక్తి సం ♦ జలిఘటించి
వేగ బోయెద నీనాథు ♦ వేగ దెత్తు
ననుచు బలుమారు బలుకుచు ♦ జనె వివేద్య
సమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 73

గీ. సీతయాజ్ఞను గైకొని ♦ సిద్ధఖచర
పన్నగాదిముఖామరు ♦ లన్నుతింప
నలసువేలాద్రికెక్కె వే ♦ యతిరయమున
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 74

గీ. కొండపైనుండి యుద్దండ ♦ ఖండగతిని
జలధిదాటుచో మైనాక ♦ శైలమువుగు
గారవింపంగ విశ్రాంతి ♦ గనవె ధీర
యమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 75

గీ. శైలముననుండి యవ్వల ♦ జలధిదాటి
నీదురాకకు వేడ్కతో ♦ నెదురుచూచు
వానరుల నాదరింపవె ♦ భళియనంగ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 76

గీ. కంటిసీతను సుగుణవా ♦ ల్గంటి ననుచు
బలుకవారలు సంతోష ♦ జలధిమునిగి
యుందకును జేయరేనీకు ♦ వందనములు
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 77

గీ. ఎటుల జలనిధిదాటితి ♦ నెటులలంక
జొచ్చి సీతనదెట్టుల ♦ జూచితయ్య
దెల్పుమన వారికిట్టుల ♦ దెల్పితివిగ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 78

గీ. వీక జలనిధిదాటి పై ♦ నాకమెగుట
గాంచి పిమ్మటసురసను ♦ గాంచుటయును
లంకజొచ్చుట దెల్పవే ♦ శంకదక్కి
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 79

గీ. లంఖిణినిబీచమణచి యా ♦ లంకలోన
సీతవెదకుచు గానక ♦ చింతిలుటయు
దెల్పవే శింశుపావని ♦ దేవిగనుట
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 80

గీ. రాక్షసులబట్టిచంపుట ♦ లంకగాల్చు
టయును రమణుకు కానవా ♦ లవనిజాత
యొసగుటయు దెల్పవేవార ♦ లిచ్చమెచ్చ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 81

గీ. సీతకథజెప్ప వారతి ♦ ప్రీతిజెంది
యందరును పుష్పఫలములు ♦ వతులభక్తి
గారవింపరె వినుమంత ♦ గాలితనయ
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 82

గీ. అంతకపివీరు లందఱు • సంతసమున
చెంతరా నింగిదాటుచు • గంతులిడుచు
అల్లసుగ్రీవు వనమున • కరిగిరి వీర
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 83

గీ. కపులతోడను మధువని • గదిసియున్న
ఫలములెల్లను దులిచియు • పాదపముల
విఱిచి మధువును గ్రోలరే • బరువులిడుచు
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 84

గీ. అప్పు డంగదునాజ్ఞను • సకలకపులు
పాదపములెక్కి గంతులు • వైచివైచి
సన్నుతింపరె నీశక్తి • సరసఫణితి
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 85

గీ. తనదువనమిట్లు దెగుటకు • దధిముఖుండు
చాలకోపించి వానిని • గరకుగొనక
కోర్కెఁ గిరంగ ఫలముల • గొల్లగొనరె
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 86

గీ. చాలకోపంబుతో వన • వనపాలకుండు
దోడరి కపులనుదండింప • తడయకపుడు
వానిబంధింపవె కపుల్ • భళిరయనగ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 87

గీ. కంటిసీతను లంకలో ♦ గంబుకంఠి
రాక్షస స్త్రీలమధ్యను ♦ రమణిదక్కి
దైన్యము ననుండెనసవె యా ♦ ధన్యుఁ డోడ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 93

గీ. అనుచు బలికిన పలుకుల ♦ కాదరమున
నమృతతుల్యంబులై వీను ♦ లలరవిభుని
నిన్ను గాగిటఁ జేర్చె ♦ సన్నుతించి
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 94

గీ. అలవృకావళిమధ్యను ♦ మెలగుహరిణి
పోల్కె భూపుత్రియున్నది ♦ పొలుపుదక్కి
ననుచువల్కె వెరఘుకుల ♦ ఘనునితోడ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 95

గీ. వినుము శ్రీరామ రాక్షస ♦ వీరవరులు
కోటిలక్షలు ద్వారక ♦ కాటమునను
నుండిరని దెల్పె వేడ్క ♦ మెండుకొనగ
నమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 96

గీ. పురముశోధించి లంకలో ♦ భూమిసుతను
గాంచి మణిభూషణంబాగి ♦ నంచితముగ
నానవాలుగ దెచ్చితివనవె ♦ భళిర
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 97

గీ. తలశిరోమణి చేతికి ♦ నతులభక్తి
ప్రేమకెక్కుడియొసఁగి రాముఁడు ♦ మూర్ఛమునుఁగ
వాని దేర్చెనె ధైర్యంపు ♦ వాక్యములను
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 98

గీ. చింతదొలఁగింపు శ్రీరామ ♦ స్వాంతమునను
ధైర్యమును జెంది వేగంబ ♦ దండయాత్ర
కరుగుమిఁక జాలమేటికో ♦ యనఘుఁడనవె
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 99

గీ. వీరరాక్షసవరులను ♦ బోరులోన
కపిబలంబులు జక్కాడు ♦ కరుణఁగనక
రావణునిద్రుంచి సతిఁబ్రోవు ♦ రాముఁడనవె
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 100

గీ. అనుచుఁబలికిన శ్రీరాము ♦ డట్టెలేచి
ధైర్యధుర్యుండు గాఁగసి ♦ తడయకపుడు
భానుసూనునితోనిట్లు ♦ బల్కెతివిగ
అమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 101

గీ. వానరుల బోఁధునకువేగ ♦ వేనవేల
బయనమును జేసి నీవును ♦ బయనమగుమ
టంచు దెల్పిన నీవాక్య ♦ మనుసరించి
యమలరామాంఘ్రిహృద్ధ్యేయ॥ 102

గీ. అరిజయంబును సంతతి • వరలుచుండు
మనసులో గల కోర్కెలు • ఘనత తీరు
కడుముదంబున నీశత • కంబుజదువ
నమోఽరామాంఘ్రి హృద్ధ్యేయ॥ 108

సీ. వినయాభిరామమై • వెలయునీ హస్తంబు
రాక్షసేంద్రులకవ • జగ్రిబుగాదె
విమలపవిత్రమై • వెలయునీ మంత్రంబు
భవసాగరముదాట • ప్లవముగాదె
సంతత నీకథా • శ్రవణంబు ముక్తి
బరువెత్తు సోపాన • పంక్తిగాదె
మహనీయ భవదీయ • మహిమ రామాయణా
మాలికనాయక • మణియగాదె

గీ. విజయనగరంబులోపల • వెలయుచున్న
శిల్పిజనాంత ధీమంత • కీర్తివంత
శాంతసుస్వాంత రణరంగ • ధైర్యవంత
అట్టినినునెంతు హనుమంత • యతికృతాంత.

సీ. శ్రీరామపాదాబ్జ • సేవకుండకలంక
భావుండు లోకసం • భావుడగుచు
సకలజీవులయందు • సమదృష్టిగలవాడు
కలవాడు శాంతియు • గలుగువాడు

మూషకాలంబుల ♦ జాడలన్నిటిఁ దెల్పు
గొప్పజ్యోతిశ్శాస్త్ర ♦ మెఱుఁగువాఁడు
సకలదేశాగత ♦ జాతకంబుల గాంచి
బ్రహ్మవ్రాసినరీతిఁ ♦ బలుకువాఁడు
గీ. అట్టి తాతాన్వవాయుఁడై ♦ యవనిఁబుట్టి
బహుళజనపోషకుండౌచు ♦ బరగువాని
నవనిసూర్యప్రకాశాఖ్య ♦ నమరువాని
చాలసి కలిచ్చిభక్తిచిత్త ♦ గాలిసుతుఁడు.
గీ. భూసురాన్వయతిలకుఁడై ♦ భూసురార్చ
నాధికుండౌచు నెగ్గదు సూ ♦ ర్యప్రకాశ
రావునకునెప్డు సంపద ♦ లక్ష్మి పుత్ర
పౌత్రవిజయంబులొసగూర్చి ♦ ప్రాభవమున
నతిముదంబునఁబ్రోవుమో ♦ యాంజనేయ.
సీ. తాతాన్వవాయాబ్ధి ♦ శీతమయూఖుఁడై
కలిగిన సూర్యప్ర ♦ కాశరావు
కరుణారసంబున ♦ పనగనన్ వీక్షించి
సరసంపుభల్కుల్లు ♦ నెరయబల్కి
పేదమూర్తికఁ ఫీందరి ♦ వేడ్కఁజేసెప్పుడు
యాంజనేయునకిల ♦ నంకితంబు
గాగ భక్తినిశత ♦ కంబుజేయుమటంచు

కపురంపువిడియంబు ♦ కలితభూష

గీ. ణాంబరాదులనొసగ నా ♦ డంబరముగ
చెప్పితిని తప్పులున్నను ♦ నొప్పుగాను
నాత్మబోధ్రము కానినో ♦ యాంజనేయ.
సకలశాస్త్రప్రమేయ స ♦ జ్జనవిధేయ.

గీ. పూనుమీభవ్యశతకప్ర ♦ సూనమాల
భక్తినిచ్చెద సత్కృపా ♦ సక్తమతిని
విజయనగరనివాసివై ♦ వెలయుచున్న
రంజితాఖిలగుణగేయ ♦ యాంజనేయ.

ఉ. పంతులవేదమూర్తికవి ♦ భవ్యముగా
రచియించె నీహనూ
మంతుని నామసంస్మరణ ♦ మంజుల
మా శతకంబువేడ్క న
త్యంతపుభక్తి వ్రాసిన స ♦ దా
పఠియించిన మానవాళికిన్
సంతతలక్ష్మియున్ జయము ♦ సంపదలున్
దనరారు భూస్థలిన్ .

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

శ్రీయాంజనేయార్పణమస్తు.

ఓమ్.

ప్రతియింటనుండదగినది. ప్రతివాఁడుచదువదగినది.

ఇండియా, బర్మా, సిలోన్, మెసపటోమియా,
అమెరికా, ఆఫ్రికా మొదలగు దేశములలో మిక్కిలి
ఖ్యాతిగాంచి అనేక యోగ్యతాపత్రికలను
సర్టిఫికేట్లను పొందిన

# ప్రొఫెసరు ప్రకాశరావుగారిచే

రచియింపబడిన

# జ్యోతిషరహస్యము

ఈపుస్తకములో జ్యోతిషసంబంధమగునవి, జాతకసంబంధమైనవియు, అయిన అనేకరహస్యములు, కట్టుబాట్లు, మర్మములు, బందుకట్లు కలవు. దీనియందున్న కొన్నిరహస్యములు యిప్పటికాలపు గొప్పజ్యోతిష్కులకుగూడ తెలిసినవిగా యుండవు. ఈపుస్తకము క్రొత్తగా జ్యోతిషము నేర్చుకొనువారికిని; జ్యోతిషము బాగుగ నేర్చుకొనిన ప్రసిద్ధులగుజ్యోతిష్కులకును మిక్కిలియుపయోగకరము. ఈపుస్తకము చక్కని తెనుగులో వ్రాయబడినది

జ్యోతిష మేమియును తెలియనివారు యీపుస్తకమును చదివినయెడల యీపుస్తకములో చక్కగా అమర్చబడియున్నటువంటిన్ని సులభశైలిని వ్రాయబడినటువంటిన్ని అనే

శాంశములు వారికిమిక్కిలి ఆనందమును కలిగించుచు, శ్ర
మేపి జ్యోతిశ్శాస్త్రములోనుండు అనేక విషయములను సందే
హములను వేరొకరిసహాయములేకయే నివారణచేయును. ఈ
జ్యోతిషరహస్యముయొక్క గ్రంథకర్త తనగురువుయొద్ద
నేర్చుకొనినటువంటివిన్ని, యిదివరకు యొక్కడను యింతవర
కును ప్రచురము చేయబడనటువంటివిన్ని అనేకరహస్యములు
యీపుస్తకమునందు యిమిడియున్నవి. ఇప్పటికాలమునకు
పనికివచ్చు అనేకమైన జ్యోతిషసంబంధమగు సారాంశములిం
దు కూర్చబడినవి. అనేక గొప్పజ్యోతిషులయొక్క అ
నుభవమువలన సంపాదింపబడిన విలువయిన సారాంశములు
యీపుస్తకమునందు కలవు. ప్రతివారికిని సులభసాధ్య
ముగ జ్యోతిషమును తెలుసుకొనుటకుదగిన ఉదాహరణ
ములును, చక్రములు, ఏర్పాటులు యీపుస్తకమునందు
విపులముగ వ్రాయబడినవి. చదువరులు వేరొకరిసహాయము
లేకయే బోధపరచుకొనగలరు. జ్యోతిశ్శాస్త్రమను మహా
తత్వ భావమందునుగల పెక్కురహస్యములను ప్రపంచమునకు
వెల్లడిపరచు ముఖ్యోద్దేశముతో నీగ్రంథము వ్రాయబడినది.
ఇట్టిగ్రంథ మిదివరకెప్పుడును ఎవరును ప్రకటింపలేదు
దీనివంటి గ్రంథము మరియొకటిలేదు. ఇయ్యది గ్రంథ
కర్తయొక్క అనుభవమువయిన వ్రాయబడినది. దీనినిచది
వి బాగుగా అనుభవమునకు తెచ్చుకొన్న ప్రతివారును తమకు
రాబోవు సంగతులు తెలిసికొనుటయే గాక యితరులయొక్క
భవిష్యత్తునుగూడ చెప్పగలరు.

ఈగ్రంథమునందు పెక్కుయోగములు అనగా రా
జయోగములు మొదలగునవి [illegible]

అద్భుతఫలములతో నుగలవు. ఋషిప్రోక్తమయినటువంటివిన్ని ప్రాచీనగ్రంథకర్తలచేవ్రాయబడినటువంటివిన్ని అనేకజ్యోతిషగ్రంథములయొక్క సారమే యిందిమిడియున్నది ఇప్పటి కాలపువారికి ననుగుణ్యముగనుండునట్లు యిందలిఅంశములు చక్కగా కూర్చబడినవి. మరియునియ్యాది జ్యోతిశ్శాస్త్ర రత్నాకరమునుటకెంతమాత్రము సందియములేదు దీనియందు మిక్కిలివిలువగలిగినటువంటివిన్ని ముఖ్యమైనటువంటివిన్ని ఆవశ్యకమైనటువంటివిన్ని అత్యద్భుతమైనటువంటివిన్ని జ్యోతిష సంబంధమయిన అనేకాంశము లుండుటచే ప్రతివారును తప్పక చదివితీరవలెను. ఒక్కసారి పరిశీలించిన సయిసంగతులు నిజమనిమీకేస్పష్టపడును. ఇప్పటికప్పుడే 1200 ప్రతులకు ఆర్డర్లు బుక్కుచేసియున్నాము. ఈ మొదటికూర్పుతాలూకు 800 ప్రతులుమాత్రమే యున్నవి కాబట్టిత్వరబడిననేతప్ప పుస్తకములు దొరకుటదుర్లభము.

ఈగ్రంథరాజమునుగురించి అనేకయోగ్యతాపత్రికలు లభించినను గ్రంథవిస్తరభీతిచే కొన్నిటినిమాత్రమే యీక్రింద పొందుపరచితిమి.

(1) విశాఖపట్నంనుంచి ప్రిథల లక్ష్మీనరసింహం పంతులు, బి.ఏ., బి యల్., హైకోర్టువకీలు గారిట్లువ్రాసిరి. మీజ్యోతిషరహస్యగ్రంథము నాకుచాల ఆనందమును అభిరుచిని కలిగించినది. జ్యోతిషప్రమేయమేమియు తెలియని వారికి అతిగూఢమైనటువంటివిన్ని మిక్కిలి కష్టసాధ్యమైనటువంటివిన్ని జ్యోతిషవిద్యను అతిసులభముగగ్రహించునట్టి రీతిగావ్రాసిరి. మీరుచాలాకష్టపడి యీగ్రంథము వ్రాసిరని నేనునిస్సంశయముగ చెప్పగలను. మీజ్యోతిషరహ

స్వగ్రంధము జ్యోతిషమును నేర్చుకొను ప్రతివానికిని సుల
భమార్గదాయకముగాను అమూల్యసహాయముగానున్నది.

(2) వై. కృష్ణశాస్త్రి గారు,(Librarian Palace)
లైబ్రరియన్ ప్యాలెస్ మైసూరునుండి ఇట్లు వ్రాసిరి:— మీ
జ్యోతిషరహస్యగ్రంథమును చదివినతరువాత జ్యోతిశ్శాస్త్ర
ము మనుష్యులయొక్క పదుపములకు మార్గదర్శియని నేను
తెలుసుకొంటిని. ఈగ్రంథమువలన కలిగినజ్ఞానము చాలా అ
మూల్యము జ్యోతిశ్శాస్త్రమునుగురించి వ్రాయబడినపుస్త
కములన్నిటిలో నియ్యది మిక్కిలి శ్రేష్ఠమైనది.

(3) ఏలూరునుంచి సబుజడ్జి ఆతీ నారాయణపంతులు
బి.ఏ., బి యల్, గారిట్లువ్రాసిరి:— జ్యోతిషమును నే
ర్చుకొనుప్రతివారికిని యీజ్యోతిషరహస్యము చాలయుప
యోగకరము సాధారణమైన చదువునేర్చిన స్త్రీలకుకూడ
బోధపడునట్లు యీపుస్తకము వ్రాయబడినది.

(4) అనకాపల్లి హైస్కూలులో ప్రధాన తెలుగుపండి
తులుగానున్న బ్రహ్మశ్రీ బులుసు పాపయ్యశాస్త్రి గారు
యిట్లువ్రాసిరి:— ఇందు జాతకచక్రనిర్మాణము మొదలు
కొని జాతకఫలముల తెలుసుకొనుటకు గావలసిన ముఖ్య
విషయములన్నియు సామాన్యులకయినను బోధకమగునట్లు
తేటతెనుగుమాటలతో వివరించియున్నారు ఈగ్రంథము నా
కుమిక్కిలి సంతృప్తికలిగించినది.

(5) ఓ పార్థసారధి అయ్యంగారు, హనుమంత
రాయన కోవిలవీధి, తిరువళిక్కేణి, చెన్నపట్నంనుంచి
యిట్లు వ్రాసిరి:— మీయొక్క జ్యోతిషరహస్యము జ్యోతి

షము క్రొత్తగా నేర్చుకొనువారికిని బాగుగా చదువుకొనిన వారికిని కూడా అనుగుణ్యముగానున్నది.

(6) టి. వై. శ్రీనివాసరావు గారు, హిమాయత్ నగర్ - హైదరాబాదునుంచి యిట్లువ్రాసిరి:— మీ జ్యోతిషరహస్యము జ్యోతిషవిద్యాప్రారంభకులకు చాలఉపయోగము. ఇట్టిగ్రంథమును మీరు ప్రచురించినందుకు ప్రపంచకము యొక్క కృతజ్ఞతను మీరు పొందుటకర్హులు.

(7) విశాఖపట్నంనుంచి, డాక్టరు లింగరాజుగారు (L.M.P.) యిట్లువ్రాసిరి:— మీచే రచియింపబడిన జ్యోతిషరహస్యము ప్రప్రథమమునజ్యోతిషము నేర్చుకొను వారికి మిక్కిలి విలువగలది. ఈగ్రంథ సహాయ్యముచే నేను భవిష్యత్తును కొంతవరకు తెలుసుకొనుటకు సామర్థ్యము గలవాడనయితిని. ఇంకను గ్రంథమును చదివినకొలది హెచ్చుసంగతులను తెలుసుకొనుచున్నాను.

(8) మైసూరురాష్ట్రములోని బానవరపట్టణమునుండి సబుఅసిస్టెంటు సర్జను బి. నారాయణరావుగారు యిట్లు వ్రాసిరి:— మీయొక్క జ్యోతిషరహస్యమును పూర్తిగా చదవితిని. అందులో చాలాసంతోషమును కలిగించి నటువంటివెన్ని మిక్కిలి యుపయోగ మైనటువంటివెన్ని సంగతులుగలవు. అందులోయిచ్చిన ఉదాహరణములు పట్టికలు మొదలగునవి చదువరికి మిక్కిలిసులభముగా గ్రంథమునుబోధపడునట్లుచేయును ఇతరుల సహాయ్యములేకుండ జ్యోతిషమునునేర్చుకొను ప్రతివానికిని యియ్యదిమిక్కిలి యుపయోగకరము.

ఇంకను అనేకాభిప్రాయములు కలవుగాని గ్రంథవిస్తరభీతిచే వదలితిని. పోష్టుఖర్చులుగాక దీని వెల రు 2-8-0 మాత్రమే.

వలయువారీక్రిందిచిరునామాకు వ్రాయుడు.

శ్రీకళింగజ్యోతిషనిలయము,
విజయనగరము,
(విశాఖపట్నం జిల్లా.)

---

ప్రతివారును చదివితీరవలసినది. — ప్రతియింటను వుండదగినది.

# అద్భుతభవిష్యత్ఫలదర్శిని

## అను ఆశ్చర్యకరమైన పుస్తకము.

---

ఈపుస్తకము ప్రతిమనుజునకును ప్రతిదినమును మిక్కిలి యుపయోగకరము. తరతరములనుండి వచ్చుచున్న జ్యోతిష్కులయొక్కయు, యోగీశ్వరులయొక్కయు అనుభవజ్ఞానామృతసాగరముతో నిండియున్నది. అమృతపానమును జేయుచుండుము, ఏదయిననొక కార్యము యెట్లగునో యని సందేహించు సమయమున మనస్సునకు తోచకపోవునప్పుడును, ఇదియే సన్నిహితజ్యో

తిష్కుఁడు. అనుమానసహస్రములన్నిటిని స్పష్టముగ తేటగ
విప్పిచెప్పగలఁడు. ఈగ్రంథము ప్రతివారికిని తెలియునట్లు
సులభశైలిని వ్రాయఁబడినది. జాతకము గాని పుట్టిన తేదీ వ
ఉత్తరము పొందలగునవి యేమియును అవసరము లేకయే ప్ర
తివారును వారివారిఫలములను చూచుకొనవచ్చును. ఈభవి
ష్యత్ఫలదర్శిని ముందుతోఁచఁజూపు నింటిజ్యోతిష్కుఁడు.
మనజ్యోతిశ్శాస్త్రములలో గాని, గ్రహశాస్త్రములలో గాని
ఇట్టిదిముందెన్నఁడు వెలువడలేదు. ఇదియె మొదటిది. ఎక్కు
వయినయోగ్యతాపత్రముల నందియున్నది. ఇందలి ఫలసూ
చనలచ్చొత్తినట్లు మనమునకెక్కును ఒక్కసారిపరిశీలించిన
మీకే తెలియును. ఈగ్రంథము తేటతెనుఁగులో వ్రాయఁబ
డినది. వెల ఒకరూపాయిమాత్రమే.

---

దయతో నీక్రింది యభిప్రాయములఁ జూడుఁడు.

హిందూపత్రిక యిట్లు వ్రాయుచున్నది,—తమతమ
జీవితములలో రాఁబోవుసంగతులను తెలిసికొనువారందరకు
ను యీపుస్తకము హితముగనున్నది

మైసూరు దేశములో చేరిన తుముకూరుజిల్లా డిస్ట్రిక్టు
మేజిస్ట్రేటుగారును, డిప్యూటీకమిషనరు గారున్ను అగు ఏ.
యెస్. వీర్ సీ, బి ఏ., ఎల్.ఎల్.బి., గారిట్లు వ్రాసిరి.—
ముందుగతి యేమగునో తెలిసికొనఁగోరువారికి భవిష్యత్ఫల
దర్శిని చాలయుపయోగకరమయినది.

ప్రస్తుతం ఏలూరుసబ్ జడ్జిగారగు ఏ. నారాయణ
రావుపంతులు, బి.ఏ, బి.యల్. గారు మాయవరంనుంచి
యిట్లువ్రాసిరి.— ంగలదానిని తెలిసికొనఁగోరువారికి ఈ

భవిష్యత్ ఫలదర్శిని సంతోషమును కలిగించునని వానిళ్ళయ ము. దానిజవాబు లభియించగలిగించుచున్నవి.

రాజమహేంద్రవరం గవర్నమెంటుకాలేజీలో లె క్చరర్ (Lecturer) గాయున్న ఆర్. సుబ్బారావు, ఎమ్.ఏ., ఎల్.టి. గారు యిట్లువ్రాసిరి:— మీయొక్క భవిష్యత్ ఫలదర్శిని పుస్తకమును చూడగా అదినాకుమంచి తృప్తికరముగాయున్నది.

ఇంకను వేనవేలు అభిప్రాయములు గలవు. గ్రంథవిస్తరభీతిచే యిక్కడవ్రాయలేదు. పుస్త కములు వి. పి. గా పంపబడును. పుస్తకముల కోరువారు తమ పైవిలాసమును, గ్రామమును, పోష్టును స్పష్టముగావ్రాయవలెను. పుస్తకమువ లయువారలు యీదిగువచిరునామాకువ్రాయవ లయును. నాలుగుప్రతులు ఒక్కసారికొన్న వా రికి ఒకప్రతియుచితముగా యివ్వబడును.

తాతా జ్యోతిషవిద్యాలయము,
విజయనగరము,
(విశాఖపట్నం జిల్లా.)



# మహాభృగుసంహిత

మహాభృగుసంహిత ననుసరించి జాతకఫలములు
అత్యద్భుతముగ చెప్పబడును.

ఈమహాభృగుసంహిత యొకగొప్పజాతకనాడీగ్రంథము. ఇది పూర్వకాలమున మహాఋషులచేవ్రాయబడినది. మన భరతఖండమందు జన్మించిన ప్రతిమానవునియొక్క జాతకము, వానియొక్క జననములగాయతు ఆయుర్దాయము ఆఖరువరకు జరుగుఫలితములన్నియు ఆమూలాగ్రముగ సంస్కృతశ్లోకపూర్వకముగ నిందువ్రాయబడినవి. ప్రతిమానవునియొక్క జాతకఫలములు అత్యద్భుతముగ నీగ్రంథమున వ్రాయబడినవి. జన్మసంవత్సరము, పుట్టినతేదీ, జననకాల ఘడియలు. లేక జాతకచక్రమున్న చాలును.

0-8-0 జాతకచక్రము భృగుసంహితనుండి వెదకుటకు
1-0-0 జాతకచక్రములేనివారికి తయారుచేయుటకు
2-0-0 భృగుసంహితలోని శ్లోకములకు తెనుగునర్థము వ్రాయుటకు

మొత్తము 3-8-0 అగును జాతకచక్రమున్నవారికి రు 2-8-0 మాత్రమేయగును.

ఇతరప్రదేశములలో నున్నవారిక్రిందిచిరునామాకు వ్రాసిన ఫలములు వి.పి. గా పంపబడును.

కళింగ ఎష్ట్రాలాజకల్ బీరో,
విజయనగరము, (విశాఖపట్నంజిల్లా.)

# వైరాగి చిటికీలు

పరమహంసక్రియలు.   శుద్ధక్రియలు.

అమూల్యమైన

# వైద్యశాస్త్రము

ఇట్టిది ముందెన్నడు ప్రచురింపబడలేదు.

---

ఈగ్రంథము లోకోపకారముకొరకు ప్రచురించబడినది. ఈగ్రంథమువలన అతిసులభముగ సమస్తమయినవ్యాధులును వైద్యుని సహాయము నక్కరలేకయే పోగొట్టుకొనవచ్చును. ఈగ్రంథము ప్రతియింటను తప్పకయుండ తగినదని యొకసారిచదువువారలకే తెలియగలదు. ఈగ్రంథమునందు గొప్పమహాపురుషులును, పరమహంసలునుదెల్పిన శుద్ధక్రియలు వ్రాయబడినవి. రోగములు మాన్పుకొనుటకు మిక్కిలిద్రవ్యమును పోగొట్టుకొనకయే యెవరియింట వారు ఈగ్రంథసహాయముచేత సమస్తమైనవ్యాధులను మాన్పుకొనవచ్చును. ఇదియొకగ్రంథమున్న మరివైద్యుని అవసరములేదు. వెలసులభము, ఫలసిద్ధి

కనుక గ్రంథము చదివిన వెనుక మీకే తెలియఁగ
లదు. ఇట్టిగ్రంథరాజమును మీరు యిదివఱకె
న్నఁడును చూచియుండరు. వేయేల? ఈగ్రంథ
రాజము సర్వజనోపయోగమని పొత్తముచదువు
వారలేపల్కెదరు. గాన గ్రంథమునకై త్వర
పడుడు తప్పక చదువుడు. ఇందలి పరమహంస
క్రియలనుచేసి సుఖింపుడు. ఈగ్రంథమునందు
గలపద్యములు ఆబాలవృద్ధులకును, స్త్రీలకును
బోధపడునట్లుగ సులభశైలిని వ్రాయబడినవి.
పద్యశైలిని దెలుపుటకు కొన్నిపద్యములు యీ
క్రింద వ్రాయబడినవి.

ఆ॥వె॥ నల్లేరు యుప్పుయు బల్ రక్కసియుమూటి
సమభాగములుగాను సరిగనూరి
మాత్రలుకట్టి యామాత్రలుసేవింప
యుబ్బసరోగముల్ దిబ్బజేరు.

ఆ॥వె॥ రాళ్లులేనిమంచి రాసున్నమును తెచ్చి
కొబ్బరినూనెతోగూర్చి యందు
నూరువరాలాకు క్షీరముల్ వేయుచు
కలిపితరచువ్రాయ గజ్జిపోవు.

ఆ॥వె॥ జిల్లుడు మొగ్గలు నల్లమిరియాలును
సమభాగములుచేసి పరిగనూరి
మాత్రలుకట్టి యామాత్రలొక్కొక్కటి
బుగ్గనుంచుకొనిన దగ్గుపోవు.

ఆ॥వె॥ నేలతాడివేరు నేర్పునగొని తెచ్చి
యావుపంచితమున యరగనూరి
కల్పితాగినంత కఠినమైనటువంటి
మూలవ్యాధులెల్ల మూలబడును.

సీ. కరక కాయలమీద గలుగుబొబ్బరయును
పిప్పలిమూలంబు తిప్పతీగ
వాయువిడంగంబు లాయష్టిమధుకంబు
సన్నపిప్పలియు నచ్చవుసముద్రి
పాడవిత్తసంబులు బోడసరంబును
వలమాటితుంగముస్తలును వసయు
సమములుగ తూచి పొడిచేసి సంతతంబు
ప్రొద్దునను లేచి నేతితో ముద్దచేసి
కర్షమాత్రంబు భక్షింపగలిగెనేని
గడియకొక పద్యశతకంబు నుడువుటరుదె.

బైరాగిచిటికెలు ప్రతులు వి. పి. గా పంప
బడును. ఒకప్రతివెల పోష్టుఖర్చులుకాక 0-8-0

రెండుప్రతులు ఒకసారి తెప్పించుకొనువారికి పో
స్టుఖర్చులు వుచితము మూడుప్రతులు ఒక్క
సారి తెప్పించుకొనువారికి పోస్టుఖర్చులు వుచిత
మేకాకుండ ఒకప్రతికూడ వుచితముగా ఇవ్వ
బడును. ప్రతులువలయువారు యీదిగువ చిరు
నామాకు వ్రాయవలయును.

ఆంధ్రగ్రంథాలయము,
విజయనగరము,
(విశాఖపట్నం జిల్లా.)

---

ప్రతివారికిని సులభముగ నర్థమగునట్లు వ్రాయ
బడినవి. కీర్తనలకు మీఁదను వరుసలు వ్రాయ
బడినవి. గ్రంథములు అయిపోవచ్చినవిగాన శీ
ఘ్రముగా పుస్తకములకై త్వరపడుఁడు.

పుస్తకములు కావలయువారు యీ క్రిందివిలాసమునకు
వ్రాయవలయును.

అభినవత్యాగరాజు,

సోమయాజుల సూరిదాసుకవి,

విజయనగరము, (లంకవీధి.)



ఈ ఆంజనేయశతకము వలయువారు యీది
గువ చిరునామాకు వ్రాయవలయును. ఒకప్రతి
వెల రెండు అణాలుమాత్రమే. నాలుగు ప్రతు
తులు ఒకేసారి కొనువారికి యొకప్రతియుచిత
ముగా యివ్వబడును.

ఆంధ్రగ్రంథాలయము,
విజయనగరము,
(విశాఖపట్నం జిల్లా.)



ఉ. సుందరకాండలోన కథ సుందరమై
దనరారె నిప్పుడా
నందముగాగ జెప్పితిని నంచితభక్తి
పఠింప దీని యా
సుందరకాండమంతయును క్షోణి
పఠించిన తత్ఫలంబు వే
నలదుదు రెల్లవారలను హస్తమునం
దనరారు ముక్తియున్.

---

Printed at S. V. V. Press, Vizianagram